సార్లు ఈ దేహం వృథాగా భగ్నం అయ్యింది. ఇంతటి పుణ్యకార్యం కోసం ఇప్పుడు భగ్నం చేయడానికి విచారం ఎందుకు? ధర్మోద్గతుని వీుదికి దుమ్ము పోరాదు. ఇదియే నాకు ముఖ్యం" అనుకొని ఉద్యుక్తుడయ్యాడు. అతని త్యాగనిశ్చయాన్ని దివ్యదృష్టితో తెలిసికొనిన ఇంద్రుడు "సదాప్రరుదితుడు అనుకొన్నది తక్షణం చేసివేస్తాడు. అతణ్ణే అనుసరిస్తూ శ్రేష్ఠిదారిక కూడా అలానే త్యాగానికి సిద్ధపడుతుంది. దీన్ని నివారించాలి" అనుకొని తన ప్రభావంతో ఆ భూప్రదేశాన్ని వెంటనే దివ్య చందనఉదకంతో తడిపివేశాడు.

* * *

అనేక లక్షల సంఖ్యలో గుమికూడిన ఆ పర్షదంలో (సభ= assembly) ధర్మోద్గతుడు గావించిన ప్రజ్ఞాపారమితాదేశన (demon-stration of perfection of wisdom) వినిన సదాప్రరుదితునికి అరవై లక్షల ముప్పై సమాధులు (concentrations) కలిగాయి.

-----x-----

సదాప్రరుదితుణ్ణి స్మరించగానే నామధేయ సామ్యం వల్ల వెంటనే మరో బోధిసత్త్వుడు జ్ఞాపకానికి వస్తాడు. ఈ బోధిసత్త్వుని వృత్తాంతం విపులంగా సద్ధర్మపుండరీక సూత్రంలో ఉన్నది. ఇక్కడ దాన్ని సంక్షిప్తం చేసి పాఠకులకు అందిస్తున్నాను.

సదాపరిభూతుడు (Ever Despised) అనే బోధిసత్త్వుడుండే వాడు. ఎవరైనా దారిలో ఎదురైతే చాలు వినయంగా నమస్కరించి "మీమీద నాకు చాలా గౌరవం ఉన్నది. మిమ్మల్ని నేను ఎప్పటికీ

అసహ్యించుకోను. భవిష్యత్తులో మీరు తథాగతులు అర్హతులు సమ్యక్ సంబుద్ధులు కాబోతున్నారు" అని పలికేవాడు. ప్రజలు మొదట్లో అతణ్ణి, అతని మాటలను ఉపేక్షించి ఊరుకున్నారు. కానీ ఎదుట పడినప్పుడల్లా అతడు అదే వరసగా వ్యాకరిస్తుంటే (predict చేస్తుంటే) వాళ్లకు చిరాకు వేసి "ఎవడ్రా నీవు? మాకొక తలనొప్పిగా తయారయ్యావు. మాకు బుద్ధత్వం కలుగుతుంది, బుద్ధత్వం కలుగుతుంది అని ఊదరగొట్టున్నావు. బుద్ధత్వాన్ని మేమేమీ కోరుకోవడం లేదు. పోరా పో" అని కసిరికొట్టూ అవమానించేవాళ్లు. అయినా అతడు తన పద్ధతిని మార్చుకోలేదు. ఆ తరువాత అతను కనిపిస్తే చాలు దగ్గరకు రానీయకుండా రాళ్లు తీసుకొని అతని మీదికి రువ్వేవాళ్లు. సదాపరిభూతుడు పారిపోయి ఒక చెట్టు వెనకో గోడ వెనకో దాక్కొని అక్కడ్నుంచే వాళ్లకు వినిపించేవిధంగా ఉచ్చైఃస్వరంతో "మీమీద నాకు చాలా గౌరవం ఉన్నది, పూజ్యభావం ఉన్నది. భవిష్యత్తులో మీరు తథాగతులు, అర్హతులు, సమ్యక్ సంబుద్ధులు కాబోవుచున్నారు" అని అరచి చెప్పేవాడు.

ఇది ఈనాటి కథ కాదు. ఈ లోకధాతువులో జరిగినదీ కాదు. వినిర్భోగ కల్పకాలంలో మహాసంభవ లోకధాతువులో జరిగిన కథ!

# హృదయసూత్రం పరిచయం

హృదయసూత్రం ఇరవైఐదు పంక్తుల రూపంలోనూ పద్నాలుగు పంక్తుల రూపంలోనూ* ఉన్నది. ఇక్కడ 25 పంక్తుల సూత్రాన్ని తెలుగు అనువాద సహితంగా పాఠకుల ముందుంచుతాను. ఆ రోజుల్లో లేఖకులకు రుసుము చెల్లించడానికి ఈ పంక్తుల లెక్కలు అవసరమయ్యాయి.

ఈ ఒక పేజీ చిన్న సూత్రానికి వేయి పేజీల వివరణమూ వ్రాయువచ్చు. ఒక పేజీకి ఒక పేజీ మాత్రమే అనువదించి సరిపెట్టుకోనూవచ్చు. ఈ రచయిత రెండవ పద్ధతి అవలంబించాడు.

నూరుకోట్ల పంక్తుల ప్రజ్ఞాపారమిత సూత్రం గంధర్వలోకంలో భద్రపరుపబడియున్నది. కోటి పంక్తుల గ్రంథం దేవలోకంలో ఉన్నది. ఇంత పెద్దవి మానవులకు అవసరం లేదని నాగలోకంలో భద్రపరచ బడియుండిన లక్షపంక్తుల గ్రంథాన్ని నాగార్జునుడు వెలుగులోకి తెచ్చాడు. మానవుల్లోనూ రుచిభేదాలున్నాయి. కొందరికి విస్తారంగా విషయం

---

* ప్రారంభంలో కొన్ని పంక్తులు, ముగింపులో కొన్ని పంక్తులు తీసివేస్తే పద్నాలుగు పంక్తుల రూపం అవుతుంది.

చెప్పాలి. కొందరికి సంక్షిప్తంగా చెబితే చాలు. సంక్షిప్తరుచి కలిగినవారి కోసం ఈ హృదయసూత్రం.

అనువాదంలోకి వెళ్లేముందు హృదయసూత్ర మహిమను తెలియజేసే రెండు ఇతివృత్తాలను పాఠకులకు చెబితే బాగుంటుందికదా!

## అంధగాయకుడు.

జపాన్‌లో దక్షిణహాన్షు సముద్రతీరంలో షిమొనొసెకి అనే నగరం ఉండేది. హైకీ తెగకు, వారి ప్రత్యర్థులకు జరిగిన భయంకర సముద్రపోరాట ప్రదేశమది. ఆ యుద్ధంలో హైకీ తెగ మొత్తం వీరమరణం పాలయ్యింది. ఆ తెగ అలా అంతరించిపోయినా వారి కీర్తి వీరజానపదగాథల రూపంలో ప్రజల్లో నిలిచిపోయింది. షిమొనొసెకి నగర సమీపంలో అమిదాజీ దేవాలయంలో ఒక గ్రుడ్డిబాలుడు ఆ వీరగాథలను బివా అనే తంత్రీవాద్య సహాయంతో వీనుల విందుగా పాడేవాడు. ఎంతసేపు విన్నా విసుగెత్తించని అద్భుతమైన కంఠస్వర మాధుర్యం ఆ పిల్లవాడిది. అతని పేరు హొయిచి. ప్రజలు అప్పుడప్పుడు అతణ్ణి తమ వద్దకు పిలిపించుకొని వీరగాథల గానం వినేవారు.

ఒకనాటి రాత్రి ఆ పిల్లవాడికి తన వద్దకు ఎవరో వ్యక్తి నడచివస్తున్నట్లు చప్పుడు వినిపించింది. ఆ చప్పుడు వల్ల అది ఒక సైనికుని నడక అని పిల్లవాడు గుర్తించాడు. అతని ఊహ నిజమే. ఆ వచ్చిన వ్యక్తి ఇలా అన్నాడు: "నేను సమురాయి వీరుణ్ణి. మా నాయకుడు దండుతో ఇటు వెళ్తూ ఈ ప్రదేశంలో కొన్నాళ్లుండదలచి శిబిరంలో

స్తున్నాడు. నీ గానం వినాలని ఉవ్విళ్లూరుతూ నిన్ను తోడ్కొనిరమ్మని పంపాడు."

హోయిచి అతని వెంట వెళ్లాడు. రాచశిబిరంలో ప్రవేశించాడు. ిరం చాలా సందడిగానే ఉన్నది. రాజు ఉన్నచోట ఉండే సందడి హోయిచీని భటులు రాజుగారి ముందుకు తీసుకెళ్లి ఒక మెత్తని పరచి అతణ్ణి కూర్చోమన్నారు. హోయిచీ ఆ తివాచీ మీద డైనాడు. హైకీ తెగవారి వీరమరణాన్ని వర్ణించే చివరి విషాద లను గానం చేయమని రాజు కోరాడు.

ఆ సభలో అంగనాజనం కూడా ఉన్నారు. హోయిచి గానం లుపెట్టగానే మెచ్చికోలు శబ్దాలు అన్ని వైపులనుండి వినిపించాయి. కొనసాగే కొలది మెచ్చికోలు శబ్దాలు అణిగిపోయి సభ మొత్తం ఏడుపుల ధ్వనులతో నిండిపోయింది. గానం ముగిశాక రాజు యిచీని మరో ఆరుదినాల పాటు వచ్చి గానం చేయమని కోరాడు. రువాత సమురాయి వీరుడు హోయిచీని అమిదాజీ దేవాలయంలో పెట్టి "మళ్లీ రేపు వస్తాను" అని సెలవు తీసుకొన్నాడు.

మరునాటి రాత్రి కూడా ఆ వీరుడు వచ్చి హోయిచీని బెట్టుకొని వెళ్లాడు. ఆ చీకటిలో హోయిచీ బైటకు వెళ్తుంటే ఆ యయ పరిచారకులు గమనించి "ఈ గుడ్డోడు చీకట్లో ఒంటరిగా ుకి వెళ్తున్నాడు?" అనుకొని అతణ్ణి అనుసరించారు. కానీ దట్టమైన ంచు కారణంగా అతను పోతున్న జాడ కనుక్కోలేక నలువైపుల డం ప్రారంభించారు. అలా వెతుకుతుండగా వారికి దూరం

నుండి హోయిచీ గానం వినిపించింది. గానం వినిపించిన దిశగా నడుస్తూ వాళ్లు ఒక శ్మశానం చేరారు. ఆ శ్మశానంలో ఒక మూల హోయిచీ ఒంటరిగా కూర్చొనియున్నాడు. ఆ పరిచారకులు అతణ్ణి లేవదీసి అమిదాజీ ఆలయానికి తీసుకొచ్చి ఆ ఆలయ విహార పెద్ద భిక్షువుకు జరిగిన విషయం చెప్పారు.

హోయిచీ గానం చేసింది రాజదర్బారులో కాదు శ్మశానంలోని దెయ్యాలకు అని పెద్ద భిక్షువు గ్రహించాడు. ఇలానే వదలివేస్తే ఏడవదినం రాత్రి గానం తరువాత హోయిచీ బ్రతుకడు, చంపబడుతాడు అని కూడా పెద్ద భిక్షువు గ్రహించి దెయ్యాలకు కనబడనీయకుండా హోయిచీని దాచే ఉపాయం ఆలోచించి మరుసటి దినం పొద్దు పోయాక చిన్న భిక్షువుతో ఇలా అన్నాడు: "హోయిచీ దేహం అంతా హృదయసూత్రను వ్రాసి పెట్టు." చిన్న భిక్షువు వెంటనే బ్రష్షు, ఇంకు తెచ్చి అతని దేహమంతా హృదయసూత్ర పంక్తులతో నింపివేసి అతణ్ణి ఆ రాత్రంతా మౌనంగా కూర్చోమని ఆదేశించి వెళ్లిపోయాడు. హోయిచీ మౌనంగా కూర్చొన్నాడు. సమురాయి వీరుడు వచ్చిన అలికిడి అయ్యింది. అయినా మౌనాన్ని వీడలేదు. ఉన్నట్లుండి తన రెండు చెవులు ఎవరో పుటుక్కున తెంపివేసినారు. భరించరాని బాధ! అంత బాధను అతను దిగమింగాడు. "అయ్యో, అమ్మా" అని అరవలేదు. "అరిస్తే చస్తాను" అని అతనికి తెలుసు.

మరుసటి దినం తెల్లవారగానే పెద్ద భిక్షువు, చిన్న భిక్షువు వచ్చి చూశారు. చెవులు రెండూ తెగి రక్తం కారుతున్న హోయిచీ

కనిపించాడు. తను చేసిన తప్పిదం అప్పుడు జ్ఞాపకం వచ్చి చిన్న భిక్షువు చాలా పశ్చాత్తాపం చెందాడు. హృదయసూత్రంలోని మొదటి వాక్యం ''ఏవం మయా శ్రుతమ్'' హోయిచీ దేహం మీద వ్రాయబోతూ ఆ వాక్యాన్ని చెవుల మీద వ్రాస్తే బాగుంటుందనుకొని మిగతా సూత్రాన్ని దేహమంతా వ్రాసి చివర చెవుల సంగతి అతడు మరచిపోయాడు. ఇంతకీ ఈ కథ వల్ల తెలిసేది ఏమిటంటే భూతప్రేత పిశాచాదులను దగ్గరకు రానీయకుండా నిలువరించే అద్భుతశక్తి హృదయసూత్రకు ఉందని. హృదయసూత్ర ప్రభావాన్ని తెలిపే మరొక ఇతివృత్తం:

## హ్యూయన్‌త్సాంగ్

హ్యూయన్‌త్సాంగ్(600-664) తన జీవితంలో ఎదురైన ఇక్కట్లులన్నిటినీ అధిగమించడానికి ప్రజ్ఞాపారమిత హృదయసూత్రాన్ని (Heart Sutra) నమ్ముకొన్నాడు. నైరుతి చైనాలోని షుహ్ ప్రాంతంలో ఆయన నివసించినపుడు ఒళ్లంతా కురుపులతో బాధపడుచున్న ఒక వృద్ధుణ్ణి తన కుటీరానికి తీసుకువచ్చి ఆశ్రయం ఇచ్చి సపర్యలు చేసి అతనికి ఉపశమనం కలిగించాడు. ఆ వృద్ధుడు, హ్యూయన్‌త్సాంగ్‌పట్ల కృతజ్ఞతను ప్రకటించి తన వద్ద ఉన్న ఒక చిన్న పుస్తకాన్ని కానుకగా ఇచ్చి సెలవు తీసుకొన్నాడు. ఆ చిన్న పుస్తకమే హృదయసూత్రం. దాన్ని పఠించగానే హ్యూయన్‌త్సాంగ్ జీవితం ఒక మలుపు తిరిగింది. భారతదేశానికి స్వయంగా వెళ్లి సూత్ర గ్రంథాలన్నిటినీ సేకరించి చైనాకు తీసుకరాదలచి ప్రయాణమయ్యాడు. భయంకరమైన ఒక ఎడారిలో

ఒంటరిగా ప్రయాణిస్తుండగా వింత వింత ఆకారాలతో భీతిని కలిగించే భూతప్రేతపిశాచాలు హ్యూయన్‌త్సాంగ్‌ని చుట్టుముట్టాయి. మొదట ఆయన క్వాన్-యిన్ నామమును స్మరించాడు. ప్రయోజనం కనిపించలేదు. ఆ పైన హృదయ సూత్రాన్ని పఠించడం మొదలు పెట్టాడు. హృదయసూత్ర పదాల ధ్వని ఆయన కంఠం నుండి వెలువడగానే తక్షణమే భూతప్రేతపిశాచాలు మాయమయ్యాయి.

The Buddha-Dhamma is a moral and philosophical system which expounds a unique path of Enlightenment, and is not a subject to be studied from a mere academic standpoint.

The Doctrine is certainly to be studied, more to be practised, and above all to be realized by oneself.

Mere learning is of no avail without actual practice. The learned man who does not practise the Dhamma, the Buddha says, is like a colourful flower without scent.

He who does not study the Dhamma is like a blind man. But, he who does not practise the Dhamma is comparable to a library.

- *NARADA*

# ప్రజ్ఞాపారమితహృదయసూత్రం

*ఓం నమో భగవత్యై ఆర్యప్రజ్ఞాపారమితాయై*

1

ఏవం మయా శ్రుతమ్. ఏకస్మిన్ సమయే భగవాన్ రాజగృహే విహరతిస్మ గృధ్రకూటే పర్వతే మహతా భిక్షుసంఘేన సార్థం మహతా చ బోధిసత్త్వసంఘేన. తేన ఖలు సమయేన భగవాన్ గంభీరావసంబోధం నామ సమాధిం సమాపన్నః. తేన చ సమయేన ఆర్యావలోకితేశ్వరో బోధిసత్త్వో మహాసత్త్వో గంభీరాయాం ప్రజ్ఞాపారమితాయాం చర్యాం చరమాణః ఏవం వ్యవలోకయతిస్మ. పంచస్కంధాంస్తాంశ్చ స్వభావశూన్యం వ్యవలోకయతి.

## అనువాదం

నేను వినిన విధంబెట్టిదనిన, ఒకానొక సమయమున భగవానుడు రాజగృహ నగర సమీపంలోని గృధ్రకూట పర్వతం మీద పెద్ద భిక్షు సంఘంతోనూ గొప్ప బోధిసత్త్వసంఘంతోనూ ఆసీనుడైయుండినాడు. అప్పుడు భగవానుడు "గంభీరావసంబోధం"(perception of the profound) అనే పేరు కలిగిన సమాధిలో లీనమయ్యాడు. అప్పుడు మహాసత్త్వుడు బోధిసత్త్వుడు అయిన ఆర్య అవలోకితేశ్వరుడు ప్రజ్ఞాపారమితయందు చిత్తాన్ని చరింపజేస్తూ పంచస్కంధాలను స్వభావశూన్యములుగా దర్శించినాడు.

వివరణము: మొదటి వాక్యం "ఏవం మయా శ్రుతమ్" అనేది ఆనందుని వాక్యంగా సంప్రదాయం చెబుతుంది. చారిత్రకదృష్టి కలిగినవాళ్లు హృదయసూత్రను క్రీ.శ.4వ శతాబ్దం నాటిదని చెబుతారు. ఏ కాలం నాటిదైతేనేమి బంగారం బంగారమే! ధర్మకాయాన్ని (ultimate reality) స్పృశించిన ఋషుల వాక్యాలు ఇవి అనుకొంటే సరిపోతుంది. "యత్కించిత్ సుభాషితమ్ తత్ సర్వం బుద్ధభాషితమ్" అని ఒక నానుడి ఉన్నది. ఎక్కడ ఏ చిన్న మంచిమాట విన్నా అదంతా బుద్ధభాషితమే అని పై సంస్కృత వాక్యానికి అర్థం. బోధిసత్త్వులు ధ్యానంలో అనుభవించి ఆనందించే దివ్యరూపానికి సంభోగకాయం అని పేరు. ఈ సంభోగకాయం నుండియే మహాయాన సూత్రాలు ఆవిర్భవించాయి. సమాధిస్థితుల నుండి ఆవిర్భవించిన దివ్య సూత్రాలకు కాల పరిమితులు విధించుకోవడం అధ్యాత్మికంగా సరియైన ధోరణి కాదు.

మంజుశ్రీ, అవలోకితేశ్వర, సమంతభద్ర, గగనగంజ, వజ్రపాణి, సర్వనీవరణవిష్కంభి, క్షితిగర్భ, ఆకాశగర్భ, వ్యూహరాజ, ఇంద్రజాలి, రత్నగర్భ, భైషజ్యగురు, మహాస్థామప్రాప్త మొదలగు బోధిసత్త్వుల్లో మంజుశ్రీ, అవలోకితేశ్వరులు చాలా ప్రసిద్ధులు. ప్రజ్ఞకు సాకారమూర్తి మంజుశ్రీ. కరుణకు సాకారం అవలోకితేశ్వరుడు.

ఈ భూమి మీద ఒక సంవత్సరం కాలం పాటు విడువకుండా వర్షం పడుతుందనుకొందాము. ఎన్ని చినుకులో లెక్కించడం సాధ్యమా? అలాగే అవలోకితేశ్వరుని పుణ్యసంభారాన్ని లెక్కించడం, కొలవడం

ఎవరి తరమూ కాదు. నిరుపధిశేష నిర్వాణ ధాతువులో ప్రవేశించడం ఆయనకు చిటిక వేసినంత తేలిక కానీ నిర్వాణం వద్దనుకొన్నాడు. దీనులకు, దుఃఖితులకు, బాధితులకు సహాయపడడమే లక్ష్యంగా పెట్టుకొన్నాడు. "అవలోకితేశ్వరా" అంటూ ఒక పుష్పం అర్పించినా చాలు దేవలోకం వెళ్లేంత పుణ్యం కలుగుతుంది. పర్షచ్చారాద్యభయం (సభాకంపం) ఉన్నవాళ్లు మనస్సులో అవలోకితేశ్వరుణ్ణి స్మరిస్తే చాలు భయం పోతుంది. చక్కగా ఉపన్యాసం ఇచ్చి దిగిరాగలరు. మోక్షానికి సులభోపాయంగా ఆయన "ఓం మణి పద్మే హూం" అనే దివ్య మంత్రాన్ని ప్రపంచానికి కానుకగా ఇచ్చియున్నాడు. టిబెట్టులో ఎక్కడ చూసినా ఈ మంత్రం శిలల మీద గోడల మీద లిఖింపబడియుండడం కనిపిస్తుంది. ఈ హృదయసూత్రం చివర కూడా ప్రజ్ఞాపారమిత మంత్రాన్ని మనకు ప్రసాదించియున్నాడు. ప్రజ్ఞాపారమితా స్థాయినుండి చూసిన ఆయన దృష్టికి పంచస్కంధములు స్వభావ శూన్యములుగా కనిపించాయి. సంవృతిసత్యాన్ని, పరమార్థసత్యాన్ని* ఏకకాలంలో చూడగలగడం ఒక్క బుద్ధునికి మాత్రమే సాధ్యం. బుద్ధుని అంతటివాడైన అవలోకితేశ్వరునికి సాధ్యం. మనకు కేవలం సంవృతి మాత్రమే గోచరమవుతుంటుంది. శూన్యతా యోగులకు ధ్యానంలో పరమార్థం మాత్రమే గోచరిస్తుంది.

---

* ద్వే సత్యే సముపాశ్రిత్య బుద్ధానాం ధర్మదేశనా

లోకసంవృతిసత్యం చ సత్యం చ పరమార్థతః

Buddha's teaching of the Dharma is based on two truths: A truth of worldly convention and an ultimate truth.

-ఆచార్య నాగార్జునుని మధ్యమకశాస్త్రం (25-8)

*ధ్యానం నుండి లేచాక మనకు వలె వాళ్లకు కూడా మళ్లీ సంవృతియే గోచరమవుతుంది. రెంటినీ ఏకకాలంలో చూడగలిగితే అదే బుద్ధత్వం.*

*శారిపుత్రుడు శ్రావకయానీయులలో అగ్రేసరుడు. శూన్యతా సింహనాదం వినదగు యోగ్యుడు. కనుక బుద్ధుడు అతణ్ణి అనుగ్రహింపదలచి తన అనుభావం (power) ద్వారా శారిపుత్రునికి ప్రశ్నించే ప్రేరణ ఇవ్వబోతున్నాడు.*

2

అథాయుష్మాన్ శారిపుత్రో బుద్ధానుభావేన ఆర్యావలోకితేశ్వరం బోధిసత్త్వమేతదవోచత్-యః కశ్చిత్ కులపుత్రో గంభీరాయాం ప్రజ్ఞాపారమితాయాం చర్యాం చర్తుకామః కథం శిక్షితవ్యః? ఏవముక్తే ఆర్యావలోకితేశ్వరో బోధిసత్త్వో మహాసత్త్వః ఆయుష్మంతం శారిపుత్రమేతదవోచత్-యః కశ్చిచ్ఛారిపుత్ర కులపుత్రో వా కులదుహితా వా గంభీరాయాం ప్రజ్ఞాపారమితాయాం చర్యాం చర్తుకామః తేనైవం వ్యవలోకితవ్యం. పంచస్కంధాంస్తాంశ్చ స్వభావశూన్యాన్ సమనుపశ్యతిస్మ.

## అనువాదం

ఆ పిమ్మట బుద్ధానుభావం (power of Buddha) చేత ప్రేరితుడై శారిపుత్రుడు ఆర్యఅవలోకితేశ్వరస్వామిని ఇలా ప్రశ్నించాడు: "ప్రజ్ఞాపారమితలో చరింపదలచిన కులపుత్రుడు ఏ విధమైన శిక్షణను (training) గడించవలెను?" అవలోకితేశ్వరస్వామి ఇలా అన్నాడు: "శారిపుత్రా, ప్రజ్ఞాపారమితలో చరింపదలచిన కులపుత్రుడు పంచస్కంధాలను స్వభావశూన్యములుగా దర్శించవలెను."

3

రూపం శూన్యతా, శూన్యతైవ రూపం. రూపాన్న పృథక్ శూన్యతా, శూన్యతాయా న పృథక్ రూపం. యద్రూపం సా శూన్యతా, యా శూన్యతా తద్రూపం. ఏవం వేదనా సంజ్ఞా సంస్కార విజ్ఞానాని చ శూన్యతా. ఏవం శారిపుత్ర సర్వధర్మాః శూన్యతాఽలక్షణా అనుత్పన్నా అనిరుద్ధా అమలా విమలా అనూనా అసంపూర్ణాః.

## అనువాదం

రూపం (matter / body) శూన్యత. శూన్యతయే రూపం. రూపానికి వేఱుగా శూన్యత ఉండదు. శూన్యతకు వేఱుగా రూపం ఉండదు. ఏది రూపమో అది శూన్యత. ఏది శూన్యతయో అది రూపం. ఇట్లే వేదన, సంజ్ఞ, సంస్కార, విజ్ఞానములు కూడా శూన్యతయే. శారిపుత్రా, ఈ విధంగా అన్ని ధర్మములున్నూ శూన్యతయే; లక్షణములు లేనివియే (without characteristic marks); అవి ఉత్పన్నములు కానివి (unproduced); అనిరోధములు (unceased); అమలములు (stain-less); విమలములు (not stainless); సంపూర్ణములు (without de-crease); అసంపూర్ణములు (without increase).

4

తస్మాత్తర్హి శారిపుత్ర శూన్యతాయం న రూపం, న వేదనా, న సంజ్ఞా, న సంస్కారాః, న విజ్ఞానం. చ చక్షుర్న శ్రోతమ్ న ఘ్రాణం న జిహ్వా న కాయో న మనో న రూపం న శబ్దో న గంధో న రసో న స్ప్రష్టవ్యం న ధర్మాః. న చక్షుర్ధాతుర్యావన్న మనోధాతుర్న ధర్మధాతుర్న

మనోవిజ్ఞానధాతుః. న అవిద్యా న అవిద్యాక్షయో యావన్న జరామరణం న జరామరణక్షయః. న దుఃఖసముదయనిరోధమార్గా. న జ్ఞానం న ప్రాప్తిర్నాప్రాప్తిః. తస్మాచ్ఛారిపుత్ర అప్రాప్తిత్వేన బోధిసత్వానాం ప్రజ్ఞాపారమితామాశ్రిత్య విహరత్యచిత్తావరణః. చిత్తావరణనాస్తిత్వాదత్రస్తో విపర్యాసాతిక్రాంతో నిష్ఠనిర్వాణః. త్ర్యధ్వవ్యవస్థితాః సర్వబుద్ధాః ప్రజ్ఞాపారమితామాశ్రిత్య అనుత్తరాం సమ్యక్సంబోధిమభిసంబుద్ధాః

## అనువాదం

కనుక శారిపుత్రా, శూన్యతయందు రూపం లేదు, వేదన లేదు, సంజ్ఞ లేదు, సంస్కారములు లేవు, విజ్ఞానము లేదు, చక్షువు లేదు, శ్రోతము లేదు, ఘ్రాణం లేదు, జిహ్వా లేదు, కాయం (స్పర్శేంద్రియం) లేదు, మనస్సు లేదు, రూపం లేదు, శబ్దం లేదు, గంధం లేదు, రసం లేదు, స్ప్రష్టవ్యం లేదు, ధర్మములు (mind objects) లేవు. చక్షుర్ధాతువు.... మనోధాతువు లేదు, ధర్మధాతువు లేదు, మనోవిజ్ఞానధాతువు లేదు. అవిద్య లేదు, అవిద్యాక్షయం లేదు. జరామరణములు లేవు. జరామరణ క్షయమూ లేదు. దుఃఖం లేదు, సముదయం లేదు, నిరోధం లేదు, మార్గం లేదు. జ్ఞానం లేదు, ప్రాప్తి లేదు, అప్రాప్తి లేదు. ప్రాప్తి లేదు కనుక బోధిసత్త్వుల చిత్తం ప్రజ్ఞాపారమితను ఆశ్రయించి ఆవరణరహితం అవుతుంది. ఆవరణరహితచిత్తులు కనుక భయాలు భ్రమలు లేకుండా నిర్వాణంలో నిలిచినవారవుతారు. మూడు కాలాలోని బుద్ధులు అందరు కూడా

ప్రజ్ఞాపారమితను ఆశ్రయించియే అత్యుత్తమమైన సమ్యక్సంబోధిని పొందినారు.

*వివరణము: "ఏమీ లేదు, ఏమీ లేదు" అని నిషేధించుకొంటూపోతే ఇక మిగిలియున్నదేమిటి? దృక్ స్వరూపమా? కాదు. దృక్కు-దృశ్యం సాపేక్షికములు. దృశ్యం ఉంటేనే దృక్. దృక్ ఉంటేనే దృశ్యం. కనుక ఈ రెండింటి ఉపశమనమే శూన్యత. వినేవాళ్ల భయాన్ని*, విముఖతను తగ్గించే ఉపాయంగా దీన్ని ధర్మకాయం అనీ, భూతకోటి (reality limit) అనీ, తథతా అనీ చెప్పడం ఉంటుంది. శూన్యత అనే పదం ఇష్టం లేనివాళ్లు పూర్ణత అనే పదాన్ని పర్యాయపదంగా తీసుకోవచ్చు. (శూన్యత = పూర్ణత). ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే. పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే.*

5

తస్మాద్ జ్ఞాతవ్యః ప్రజ్ఞాపారమితామహామంత్రో మహావిద్యామంత్రోఽనుత్తరమంత్రోఽసమసమమంత్రః సర్వదుఃఖప్రశమనః సత్యమమిథ్యత్వాత్ ప్రజ్ఞాపారమితాయాముక్తో మంత్రః. తద్యథా గతే గతే పారగతే పారసంగతే బోధి స్వాహా

## అనువాదం

కనుక ప్రజ్ఞాపారమిత మహామంత్రాన్ని మహావిద్యామంత్రంగా, సాటిలేని మంత్రంగా, అసమసమ (equal to the unequalled)

---

*మనకు భయం ఉండదు కానీ ప్రథమశ్రేణి యోగులెవరైనా ఉంటే వారికి ఇదంటే భయమే. వణికిపోతారు. (అభయే భయదర్శినః)

మంత్రంగా, సర్వదుఃఖ ప్రశమనంగా తెలియవలెను. మిథ్య కాదు కనుక ఇది సత్యమని తెలియవలెను. ప్రజ్ఞాపారమితలో చెప్పబడిన ఆ మంత్రం: గతే గతే పారగతే పారసంగతే బోధి స్వాహా.

*వివరణం: హృదయసూత్రం మరియూ ఇతర మహాయాన సూత్రాలు చీనాభాష, టిబెట్టుభాష, జపాన్‌భాష మొదలగు ఇతర భాషలలోనికి అనువదింపబడినపుడు మంత్రాలు, ధారణిలకు అనువాదం జరుగలేదు. మంత్రాలు, ధారణీల్లోని పదాలకు అర్థం తెలుసుకొనే విధానం సరికాదేమో! ఇవి శబ్దశక్తి కలిగినవి కనుక శబ్దాలకే ప్రాధాన్యం. కనుక ఇతర భాషలవారు మంత్రాలను, ధారణీలను యథాతథంగా వాళ్ల లిపిలో వ్రాసుకొన్నారు (transliteration). మంత్రం మీద వివరణం కొంచంగానైనా పాఠకులు ఆకాంక్షిస్తారు కనుక వజ్రపాణి అనే వ్యాఖ్యాత వివరణం కొంచంగా ఇక్కడ చూపుతాను. రెండవ ధ్యానంలో చిత్తం, వితర్క విచారాలనుండి (thought process) విముక్తమవుతుంది కనుక ఆ స్థితిలో చిత్తం వాగుడు నుండి విముక్తమవుతుంది. (గతే గతే). నాలుగవ ధ్యానంలో శ్వాసప్రశ్వాసలు ఆగిపోతాయి కనుక కాయిక వ్యాపారం నుండి చిత్తం ఆ స్థితిలో విముక్తమవుతుంది. (పారగతే). సంజ్ఞా వేదనీయ నిరోధ సమాపత్తిలో చిత్తం దుఃఖం నుండి విముక్తమవుతుంది కనుక పారసంగతే. మనస్సు పూర్తిగా ఉపశమించాక బోధి. దేవీ మంత్రం కనుక ముగింపుగా స్వాహా.*

*శూన్యతాధ్యానం వీలుపడనివారిని కూడా అనుగ్రహిస్తూ హృదయసూత్రం చివర అవలోకితేశ్వరుడు మహాకరుణతో ఈ మంత్రాన్ని*

ప్రసాదించాడు. పెదవులు, నోరు, నాలుక కదిలించకుండా జపించడానికి వీలయ్యే మంత్రం ఇది. భక్తి, శ్రద్ధ, వినయం, గౌరవం తప్పించి ఇతర నియమాలు అక్కర్లేదు. చేయవలసిన దైనందిన పనులు వదలివేసి జపం చేయవలసిన అవసరం లేదు. ఏమీ పని చేయకుండా ఊరక కూర్చొన్న సమయాల్లో లేదా పడుకొన్నాక నిద్ర పట్టేంతవరకూ చేయవచ్చు. ఏమీ పనిలేని సమయాల్లోనే మనస్సు పనికిమాలిన ఆలోచనలు చేస్తుంది. కనుక అట్టి సమయాల్లో ఈ మంత్రాన్ని ఉపయోగించుకొంటే సరిపోతుంది. జపించడం అనేది ఒక విధిగా కర్తవ్యంగా భావించరాదు. బరువుగా యాంత్రికంగా చేయనే చేయకూడదు. ఏదో లభిస్తుంది అనే లోభంతో (greed) అసలే చేయకూడదు. ప్రార్థన విషయంగానూ ఇంతే. జపానికి ముందు కొంతసేపు ఉదాత్తమైన భావన చేస్తే చేసుకోవచ్చు. నిర్వాణానికి రాచబాట ఇది అనీ, ధర్మకాయ ప్రవేశానికి ద్వారాలు తెరచేది ఇది అనీ, బుద్ధులు, బోధిసత్త్వులు, యోగులు, ఋషులు మొదలగువారి చిత్తాలతో తన చిత్తాన్ని అనుసంధింపజేసేది ఇది అనీ, మారసైన్యాన్ని దూరంగా ఉంచేది ఇది అనీ ఇంకా ఇలా తోచిన రీతిలో కాసేపు ఊహించాక జపం మొదలుపెట్టే బాగుంటుంది. జపించేటప్పుడు మౌనంగా జరిగే శబ్దోచ్చారణ మీదనే మనస్సు పెట్టాలి. కాలనియమం, సంఖ్యానియమం, ఆసననియమం అక్కర్లేదు. ఈ రచయిత ఈ వివరణాన్ని తనకు తానే ఇచ్చుకొంటున్నాడు కనుక పాఠకులు అవశ్యం స్వీకరించవలసిన అగత్యం ఏమీ లేదు. అధ్యాత్మికంగానూ ఎవరికివారు ప్రయోగాలు చేయడం, స్వానుభవాన్ని చూసుకోవడం చేయాలి. క్లిక్

*అయితే సరి కాకపోతే వదలివేయవచ్చు. గతే గతే పారగతే పారసంగతే బోధి స్వాహా*

6

ఏవం శారిపుత్ర గంభీరాయాం ప్రజ్ఞాపారమితాయాం చర్యాయాం శిక్షితవ్యం బోధిసత్త్వేన.

అథ ఖలు భగవాన్ తస్మాత్సమాధేర్వ్యుత్థాయ ఆర్యావలోకితేశ్వరస్య బోధిసత్త్వస్య సాధుకారమదాత్-సాధు సాధు కులపుత్ర ! ఏవమేతత్ కులపుత్ర, ఏవమేతద్ గంభీరాయాం ప్రజ్ఞాపారమితాయాం చర్యాం చర్తవ్యం యథా త్వయా నిర్దిష్టమ్. అనుమోద్యతే తథాగతైరర్హద్భిః.

ఇదమవోచద్భగవాన్. ఆనందమనా ఆయుష్మాన్ శారిపుత్రః ఆర్యావలోకితేశ్వరశ్చ బోధిసత్త్వః సా చ సర్వావతీ పరిషత్ సదేవమానుషాసురగంధర్వశ్చ లోకో భగవతో భాషితమభ్యనందన్.

ఇతి ప్రజ్ఞాపారమితాహృదయసూత్రం సమాప్తమ్

## అనువాదం

శారిపుత్రా, బోధిసత్త్వులయినవారు గంభీరమైన ప్రజ్ఞాపారమితను పైన తెలిపిన విధంగా తెలుసుకొనవలెను.

ఆ పిమ్మట భగవానుడు సమాధి నుండి వ్యుత్థితుడై అవలోకితేశ్వరుణ్ణి ఈ విధంగా మెచ్చుకొన్నాడు: "సాధు సాధు (well done well done) కులపుత్రా అవును అది అటులనే. నీవు తెలిపిన విధంగానే గంభీరమైన ప్రజ్ఞాపారమితయందు చరించవలెను. తథాగతులు,

అర్హతులచే ఇది అనుమోదింపబడినదియే."

భగవానుడు ఇట్లు పలికిన తరువాత శారిపుత్రుడు, అవలోకితేశ్వరుడు, ఆ పరిషత్తు మొత్తమూ, దేవతలు, మనుష్యులు. అసురులు, గంధర్వులు అందరూ ఆనందంతో భగవంతుని భాషితమును అభినందించిరి.

*ప్రజ్ఞాపారమిత హృదయసూత్రం సమాప్తం*

*వివరణ: బుద్ధుని బోధనలు ఎక్కడ వినిపిస్తాయో అక్కడికి దేవతలు ఆలకించడానికి వస్తారని నమ్మకం. చతుర్మహారాజికులు, త్రయస్త్రింశులు, యామకులు, తుషితులు, నిర్మాణరతులు, పరనిర్మితవశవర్తినులు, బ్రహ్మకాయికులు, బ్రహ్మపురోహితులు, మహాబ్రాహ్మణులు, పరీత్తాభులు, అప్రమాణాభులు, ఆభాస్వరులు, పరీత్తశుభులు, అప్రమాణశుభులు, శుభకృత్స్నులు, అనభ్రకులు, పుణ్యప్రసవులు, బృహత్ఫలులు, అబృహులు, అతపులు, సుదృశులు, సుదర్శనులు, అకనిష్ఠులు- ఈ ఇరవైమూడు వర్గాల దేవతలకు కూడా బుద్ధుని సూత్రములంటే చాలా ఇష్టము. మహాయాన సూత్రములు- అందులోనూ సద్ధర్మపుండరీకసూత్రం అంటే దేవతలకు మరీ ఇష్టమని కొందరి నమ్మిక. ఉదాహరణగా జపాన్‌దేశం కథ ఒకటి.*

*జపాన్‌దేశంలో హోగెన్ అనే భిక్షువు అవతంసకసూత్ర (Garland Sutra) భక్తుడు. హోగెన్ సూత్రపఠనం పట్ల ప్రీతి చెంది ఒక దేవత రోజూ అతనికి ఆహారం తెచ్చి ఇచ్చేది. ఒకనాడు అతణ్ణే*

చూడడానికి అతని మిత్రుడు రెంజో వచ్చాడు. రెంజో సద్ధర్మ పుండరీకసూత్ర (Lotus Sutra) భక్తుడు. కుశలప్రశ్నలు వేసుకొని కొంతసేపు మాట్లాడుకొన్నాక రెంజో సెలవు తీసుకొంటూ లేచాడు. హోగెన్ అతణ్ణి వెళ్లనివ్వలేదు. "కాసేపు ఆగు, దేవతా భోజనం వస్తుంది. ఆరగించి వెళ్లవచ్చు" అన్నాడు. రెంజో కూర్చున్నాడు. సమయానికి సరిగ్గా భోజనం తెచ్చి అందించే దేవత ఆ దినం ప్రత్యక్షం కాలేదు. మిట్టమధ్యాహ్నం గడిచింది. భోజనం రాలేదు. మధ్యాహ్నం దాటితే బౌద్ధభిక్షువులు ఆహారం తీసుకోరాదు గనుక "ఇక ఈ వేళకి ఉపవాసమే" అంటూ రెంజో లేచి తన నివాసానికి బయలుదేరాడు. హోగెన్ ఆలోచనలో పడ్డాడు: "ఏమిటి ఈ రోజు ఇలా అయ్యింది? దేవత అనుగ్రహాన్ని కోల్పోయానా? లేక రెంజోలో ఏమైనా లోపం ఉండి దేవత రాలేదా?" ఇలా నానా విధాలుగా చింతల పాలయ్యాడు. మరునాడు దేవత ప్రత్యక్షమయ్యింది. "నిన్న ఎందుకు భోజనం తీసుకురాలేదు?" అని హోగెన్ అడిగాడు. "అది నీ తప్పు. ఆ రెంజోని ప్రక్కన కూచోబెట్టుకొన్నావు. అతడు సద్ధర్మపుండరీకాన్ని ధారణ చేసి పారాయణం చేసేవాడు. అతడు ఎక్కడుంటే అక్కడ దేవతలు క్రిక్కిరిసి గుమికూడుతారు. నిన్న ఇక్కడ అలాగే అయ్యింది. సద్ధర్మపుండరీకసూత్ర ప్రియులైన దేవతల రద్దీ వల్ల నేను లోనికి రాలేకపోయాను!"

# వజ్రచ్ఛేదిక పరిచయం

వజ్రచ్ఛేదిక (Diamond that cuts through illusion) మూడు వందల పంక్తుల చిన్న గ్రంథం. దీని ఉపయోగమేమిటంటే: మనలో లోతుగా పాతుకొనిపోయిన సత్కాయదృష్టి (individuality view) అనే అజ్ఞాన మహాపర్వతాన్ని- ఇరవై శిఖరాల మహాపర్వతాన్ని-తుత్తునియలు చేయడమే.

ప్రపంచంలో తొట్టతొలుతగా ముద్రితమైన గ్రంథం వజ్రచ్ఛేదిక. క్రీ.శ.864వ సంవత్సరం, మే నెల 11వ తేదీనాడు చైనాలో ముద్రణ పొందింది. మహాయానం వ్యాపించిన దేశాల్లో ఇది నిత్యపారాయణ గ్రంథం. చైనా, టిబెట్, మంగోలియా, కొరియా, జపాన్, వియత్నామ్ దేశాల్లోని బౌద్ధులు ఈ గ్రంథాన్ని భక్తి శ్రద్ధలతో పఠిస్తారు.

బుద్ధవచనాన్ని భక్తి శ్రద్ధలతో పఠిస్తే కలిగే ప్రయోజనాన్ని ఇంత అంత అని కొలవలేము. వేయిమైళ్ల దూరం నడచిపోదలచినవాడు చేయవలసిన మొదటి పని అడుగు వేయడమే. ఈ గ్రంథాన్ని పఠించడం ద్వారా మనం అధ్యాత్మికంగా ముందడుగు వేసి ముందుకు పోదాము.

ఈ గ్రంథం చిన్నదైనా చైనా బౌద్ధాచార్యులు దీనిని ముప్పైరెండు భాగాలుగా విభజించారు. మనకు ఈ గ్రంథం నిండా పునరుక్తులే కనిపిస్తాయి కానీ కుమారజీవుడు, వసుబంధువు మొదలగు

బౌద్ధాచార్యుల దృష్టి వేరు. వారికి మొదటి పదమూడు భాగాల్లో పదిహేడు స్థూలసంశయాల తొలగింపు, మిగిలిన భాగాల్లో పద్దెనిమిది సూక్ష్మసంశయాల తొలగింపు జరిగినట్లు కనిపించింది.!

వజ్రచ్ఛేదిక చదివే పాఠకులకు ముందుగానే హెచ్చరిక ఇవ్వడం బాగుంటుందని అష్టసాహస్రిక ప్రజ్ఞాపారమితనుండి కొన్ని వాక్యాలు:

*ప్రజ్ఞాపారమిత మీద సుభూతి చేస్తున్న ప్రసంగం వింటున్న దేవకుమారుల్లో కొందరు మనస్సులో ఇలా అనుకొన్నారు:- "యక్షులు పరస్పరం గొణుక్కునే "కకబికా" భాష కూడా సులభంగానే మనకు అర్థం అవుతుంది. ఈ సుభూతి ఏమి చెబుతున్నాడో ఏమి బదులిస్తున్నాడో ఏమి ఉపదేశిస్తున్నాడో కొంచం కూడా తెలియడం లేదు."*

*దేవకుమారులు మనస్సులో ఏమి అనుకొంటున్నారో గ్రహించిన సుభూతి ఇలా అన్నాడు:- "దేవకుమారులారా, ఇక్కడ తెలుసు కొనేందుకు ఏమీ లేదు, ఏమీ లేదు."*

పాఠకులను మొదట్లోనే ఇలా హెచ్చరిక చేసి పుస్తకాన్ని మూసివేయించడం తగదు కనుక పఠనం పట్ల పాఠకుల్లో ఉత్సాహాన్ని కలిగించడం కోసం ఆరవ గురువుగారి ఆత్మకథతో వజ్రచ్ఛేదిక మొదలుపెట్టున్నాను.

# ఆరవ గురువు

*దక్షిణాది జెన్ (ధ్యాన) సంప్రదాయానికి చైనాలో హుయ్-నెంగ్ ఆరవ గురువు. సంప్రదాయాన్ని బుద్ధుని నుండి లెక్కిస్తే హుయ్-నెంగ్ 33వ గురువు అవుతాడు. ఈ సంప్రదాయాన్ని చైనాలో ప్రవేశపెట్టిన బోధిధర్ముడు జెన్‌కు చైనాలో మొదటి గురువయ్యాడు. అసలు మూల గురువు బుద్ధుడు. ఒకనాటి భిక్షు సమావేశంలో బుద్ధుడు ఏమీ మాట్లాడకుండా ఒక పుష్పాన్ని చేతిలోకి తీసుకొని దాన్ని తదేకంగా చూస్తూ ఉండినాడట! అక్కడ సమావేశమైన భిక్షువులలో మహాకాశ్యపుడు ఒక్కడు మాత్రమే ఆ సంకేతం యొక్క పరమార్థాన్ని గ్రహించి మందహాసం చేస్తూ తక్షణమే ముక్తుడయ్యాడట! జెన్ సంప్రదాయం ఇలా మొదట బుద్ధుని హృదయం నుండి మహాకాశ్యపుని హృదయానికి ఆ తరువాత మహాకాశ్యపుని నుండి ఆనందునికి ఇలా సంక్రమిస్తూ (heart to heart transmission) ఆ పరంపరలో 28వ వాడైన బోధిధర్మునికి సంక్రమించింది. బోధిధర్ముడు హిమాలయాలు దాటి చైనాకు వెళ్లి అక్కడ ఈ సంప్రదాయానికి మొదటి గురువయ్యాడు. ఇక ఆరవ గురువుగారి ఆత్మకథ.*

* * * * *

ఒకనాడు ఆరవ గురువుగారు కాంటన్ నగరంలోని పావ్‌లిన్ విహారానికి వేంచేశారు. అప్పుడు ఆ నగరపాలకుడు ఇంకా ఇతర ఉన్నతాధికారులు గురువుగారిని సందర్శించి ఆ నగరంలోని ట-ఫన్

దేవాలయం హాలులో బౌద్ధం గురించి ప్రసంగాలు చేయవలసినదిగా మనవి చేశారు. గురువుగారు అంగీకరించారు.

ప్రసంగం వినడం కోసం నగరపాలకుడు, అధికారులు, కన్‌ఫ్యూషియన్ విద్వాంసులు, టావోయిస్టులు, భిక్షువులు, భిక్షుణిలు ఇంకా ఇతర ప్రముఖ పురజనులు మొత్తం ఓ వేయి మంది హాలులో గుమికూడారు. గురువుగారు వచ్చి ఆసనం మీద కూర్చోగానే అందరూ ఒక్కసారిగా లేచి నమస్కరించి బౌద్ధధర్మాలను చెప్పవలసినదిగా మనవి చేశారు. గురువుగారు అక్కడ చేసిన ప్రసంగ పరంపరలో ఇది మొదటిది:

విద్వజ్జనులారా, బోధిబీజం (seed of enlightenment) మన మనస్సులోనే ఉంది. మనస్సు ద్వారానే మనం బుద్ధత్వం పొందవలసియున్నది. కనుక మొత్తం ధార్మిక జీవితం మనస్సును చక్కజేసుకోవడం* తప్పించి అన్యమేమీ కాదు. నిగూఢమైన (esoteric)

---

* మనస్సును చక్కజేసుకోవడం మీద శాంతిదేవుడు బోధిచర్యావతారంలో చెప్పిన రెండు శ్లోకాలు గమనించదగినవి:

భూమిం ఛాదయితుం సర్వాం కుతశ్చర్మ భవిష్యతి
ఉపానచ్చర్మమాత్రేణ ఛన్నా భవతి మేదిని

ఈ భూమి నడవడానికి సుఖంగా లేదు. రాళ్లు రప్పలు గాయపరుస్తాయి. ఏమి చేయాలి? మొత్తం భూమిని మెత్తని చర్మంతో (leather) కప్పగలమా? అసాధ్యం, కాని ఉపాయం ఉన్నది. ఒక జత చెప్పులు కాలికి తొడుక్కుంటే మొత్తం భూమిని మెత్తని చర్మంతో కప్పివేసినట్లే!

బాహ్యే భావా మయా తద్వచ్ఛక్యా వారయితుం న హి
స్వచిత్తం వారయిష్యామి కిం మమాన్యైర్నివారితైః

బాహ్యజగత్తును (external events)నాకు అనుకూలంగా త్రిప్పుకోవడం అసాధ్యమైన పని. కానీ సుఖంగా శాంతంగా జీవించడానికి ఉపాయం ఉన్నది. స్మృతి సంప్రజన్యములనే (mindfulness and awareness) జత చెప్పులను మనస్సుకు తొడుక్కోవడమే.

మన జెన్ సంప్రదాయానికి నేను ఎలా వారసుడనయ్యానో ఇప్పుడు చెబుతాను.

మానాన్న ఫన్-యాంగ్ ప్రాంతీయుడు. అక్కడ ఒక అధికారిగా ఉండేవాడు. ఏదో కారణం వల్ల ప్రభుత్వం అతని అధికారాన్ని ఊడబెరికి ఆ ప్రాంతం నుండి బహిష్కరించింది. ఆయున కువాంగ్‌టుంగ్‌కు వలసపోయి అక్కడ మామూలు పౌరుడుగా జీవిస్తూ ఉండగా దురదృష్టవశాత్ నా చిన్న వయస్సులోనే ఆయన అకాలమరణం చెందారు. ఆ దుర్ఘటన తరువాత నా తల్లికి అక్కడ జీవనం కష్టమయి నన్ను తీసుకొని కువాంగ్‌చౌ చేరింది. కుటుంబ పోషణ కోసం నేను చాలా చిన్న వయస్సులోనే చదువుసాములకు బదులు ఏదో ఒకటి చేయవలసి వచ్చింది. కట్టెలు కొట్టి అమ్మే పని చేపట్టాను.

ఒకనాడు బజారువీధిలో ఒక కొట్టులో కట్టెలమోపు దింపి చిల్లర తీసుకొని వెనుదిరిగి వస్తుండగా ఆ వీధిలో ఒక తిన్నె మీద కూర్చొని ఒకడు పుస్తకాన్ని చదువుతూ ఉండడం వినిపించింది. కాసేపు అలానే నిలుచుని విన్నాను. "ఇంద్రియ విషయాలైన రూప శబ్ద రస గంధ స్పృష్టవ్యాలలో మనోవిషయములైన ధర్మాలలో (mind–objects) చిత్తాన్ని తగుల్కోనీయరాదు" అనే వాక్యం వినగానే ఆ క్షణంలోనే నా చిత్తం విముక్తమయిపోయింది. "పుస్తకం పేరేమిటి?" అని అతణ్ణి అడిగాను. "వజ్రచ్ఛేదిక ప్రజ్ఞాపారమిత సూత్రం" అన్నాడతడు. "నీవు ఏ ఊరివాడవు? ఇక్కడ కూర్చొని దీన్నెందుకు చదువుచున్నావు?" అని అడిగాను. "హుయాంగ్‌మి జిల్లాలో ఉన్న టుంగ్-షన్ విహారంలో

కొన్నాళ్లుండి వచ్చాను. అక్కడ ఐదవ గురువు హుంగ్–జెన్ ఉంటున్నారు. ఆయనకు అక్కడ వేయిమంది శిష్యులున్నారు. గృహస్థులను, భిక్షువులను అందరినీ వజ్రచ్ఛేదికను పఠిస్తూ ఉండమని ప్రసంగాల్లో చెబుతుంటారు. ఆ పఠనం వల్ల ప్రకృతి ప్రభాస్వరచిత్తం (perfectly pure and translucent in it's own nature) అనుభవానికి వస్తుంది అని కూడా చెబుతుంటారు" అన్నాడు ఆ ఆగంతకుడు.

ఆనాడు ఆ వీధిలో ఆ విధంగా వజ్రచ్ఛేదిక సూత్రం వినడం అనే మహాభాగ్యం నా పూర్వజన్మల సుకృత ఫలమే. టుంగ్–షన్ విహారానికి వెళ్లమని నా హృదయం తొందర పెట్టింది. కానీ నా తల్లిని నిస్సహాయురాలిగా వదలి వెళ్లడం తగదని భావించి ఆగాను. ఆమె పోషణకు తగిన ఏర్పాటు చేసిగానీ పోరాదని నిశ్చయించాను. మరొక అద్భుతం వెంటనే జరిగింది. ఒకనాడు బజారులో ఒక అపరిచిత వ్యక్తి నన్ను ఆపి "అబ్బాయ్, నీవు ఐదవ గురువు వద్దకు వెంటనే వెళ్లాలి. నీ తల్లి పోషణ ఏర్పాట్లకు దీనిని ఉపయోగించు" అని నా చేతిలో నాణాల సంచిని ఉంచి వెళ్లిపోయాడు.

ఒక నెల ప్రయాణం తరువాత టుంగ్–షన్ విహారం చేరి గురువుగారిని దర్శించి నమస్కరించాను. "నీవు ఎక్కడ్నుంచి వచ్చావు? ఏమి ఆశించి వచ్చావు?" అని ఆయన ప్రశ్నించారు. "నేను క్యాంగ్‌టుంగ్ ప్రాంతీయుడను. సాధారణ పౌరుడను. మీ దర్శనం కోసం అంత దూరం నుండి వచ్చాను. బుద్ధత్వం తప్పించి నేనింకేమీ ఆశించడం లేదు" అన్నాను. "క్యాంగ్‌టుంగ్ వాడవా నీవు? ఒక మ్లేచ్ఛుడవు

(barbarian) కదా! బుద్ధత్వాన్ని ఎలా ఆశించగలవు?" అన్నారు గురువుగారు. "ఉత్తరాది వాళ్లున్నారు, దక్షిణాది వాళ్లున్నారు. కానీ ఈ ఉత్తరం దక్షిణం తేడాలు బుద్ధత్వానికి లేదుకదా!" అన్నాను నేను. ఆయన ఏదో చెప్పాలనుకొన్నారు కానీ అక్కడ శిష్యులు చాలా మంది ఉండడం వల్ల ఆపివేసి "పనిలోకి దిగు" అన్నారు. "గురువుగారికి ఒక విషయం మనవి చేస్తాను. విజ్ఞప్తిమాత్రతాసిద్ధి (pure awareness) నుండి చలించనివాడు పుణ్యక్షేత్రం అవుతాడుకదా! ఈ పుణ్యక్షేత్రానికి మీరు ఏ పని అప్పగిస్తారో నాకు తెలియదు" అన్నాను. "ఈ మ్లేచ్ఛుడు అతి తేజస్వి" అని గురువుగారు మెల్లగా పలికి ఆపైన గట్టిగా "నోరు మూసుకొని దొడ్లోకి వెళ్లి కట్టెలు కొట్టే పనో వడ్లు దంచే పనో ఏదో ఒకటి చెప్పింది చేయి" అని కసిరారు.

ఎనిమిది నెలలు గడిచింది. కట్టెలు చీల్చే పని, వడ్లు దంచే పని చేస్తూ ఉండిపోయాను. ఒకనాడు గురువుగారు ఏకాంతంగా నావద్దకు వచ్చి "మ్లేచ్ఛుడా, బౌద్ధంలో నీకు మంచి జ్ఞానం ఉందని నాకు తెలుసు. కానీ నీతో మాట్లాడను. ఎందుకో తెలుసా? ఇక్కడున్న పాపకర్ముల వల్ల నీకు అపాయం కలుగరాదని" అన్నారు. "ఆ విషయం నాకూ తెలుసు. కనుకనే మీ నివాసం దరిదాపులకు కూడా నేను రావడం లేదు" అన్నాను.

గురువుగారు ఒకనాడు శిష్యులనందరినీ సమావేశపరచి "దుఃఖ సముద్రం నుండి బైటపడే మార్గం చూసుకోవాలి. ఏవో పుణ్యకార్యాలు,

కర్మకాండలు చేయడం చాలదు. చిత్తాన్ని నిరావరణంగా (unobstructed, unobscured) చేసుకోవాలి. ఇక మీమీ కుటీరాలకు వెళ్లి మీ మనస్సులో ఉన్న ప్రజ్ఞను వెలికి తీయండి. ఆపైన ఒక గాథను (stanza) వ్రాసి నాకు చూపండి. ప్రజ్ఞ (insight) మీద ఎవడు చక్కని గాథను వ్రాస్తాడో అతనికి గురుచీవరాన్ని (robe, the insignia of the partriarchte) మరియూ ధర్మరహస్యాలను (esoteric teachings of dhyana school) అప్పగించి ఆరవ గురువుగా నియమిస్తాను. గాథను వ్రాయడానికి దీర్ఘకాల మీమాంస (deliberation) అవసరం లేదు. స్వీయ చిత్తగ్రంథాన్ని చక్కగా చదివినవాడు, అర్థం చేసుకొన్నవాడు గాథను క్షణంలో చెప్పగలడు. ఇక వెళ్లండి" అన్నారు.

శిష్యులు తమతమ నివాసాలకు వెళ్తూ ఒకరితో ఒకరు "గాథను వ్రాసి చూపడం వృథా శ్రమ. గురుపీఠాన్ని ఎక్కబోయేది మన అధ్యాపకుడు షెన్-ష్యూగారే. ఆయన గాథ ముందు నిలువగల గాథను వ్రాసే మొనగాడెవడున్నాడు ఇక్కడ?" అని చెప్పుకొంటూ షెన్-ష్యూగారిని ప్రశంసిస్తూ వారి వారి కుటీరాలు చేరి పడకలు వేసుకొని పడుకొని హాయిగా నిదురించారు.

అధ్యాపకుడు షెన్-ష్యూ పరిస్థితి భిన్నంగా ఉంది. "ఈ గాథా పోటీలో నేనున్నానని నా విద్యార్థులెవరూ ఇందులో పాల్గొనరు. గాథ వ్రాసి గురువుగారికి చూపాలా? వద్దా? చూపకపోతే గురువుగారికి ఎలా తెలుస్తుంది–నా జ్ఞానం గంభీరమా మిడిమిడియా అనే విషయం?

కానీ ముందుగా నేను నా మనస్సులో ఏముందో చూసుకోవాలి. ధర్మరహస్యాలు తెలుసుకోవాలనే సదాశయం ఒకటే ఉంటే గాథ వ్రాసి చూపడం మంచిదే. గురుపీఠం మీద మక్కువ మనస్సులో దాగియుంటే మాత్రం గాథ వ్రాసి చూపడం మంచిది కాదు. నన్ను నేను పృథక్జన (worldling) స్థాయికి దించుకోవడం అవుతుంది. మరి గాథ వ్రాసి చూపకపోతే ధర్మరహస్యాలు తెలుసుకొనే అవకాశం కోల్పోతాను. ఇది నిజంగా చిక్కు సమస్యే. ఎలా చేయడం? వ్రాస్తామా? వద్దా? " అని డోలాయమానమానసుడయ్యాడు.

గురువుగారి సభామందిరానికి మూడు ప్రవేశద్వారాలున్నాయి. ఆ ప్రవేశద్వారాల గోడల మీద త్వరలోనే లు-చెన్ అనే ప్రసిద్ధ ఆస్థాన కళాకారుడు లంకావతార సూత్రానికి సంబంధించిన వర్ణచిత్రాలను మరియూ ఐదుగురు గురువుల చిత్రాలను చిత్రించబోతున్నాడు.

షెన్-ష్యూగారు ఎట్టకేలకు గాథను వ్రాసి చూపడమే మంచిదనే నిశ్చయానికి వచ్చి వెంటనే ఒక గాథను వ్రాసి గురువుగారి సభా మందిరానికి వెళ్లాడు. కానీ లోనికి ప్రవేశించి ఆ గాథను గురువుకు చూపించే సాహసం చేయలేకపోతున్నాడు. ఆ తరువాత వరుసగా నాలుగు రోజుల్లో మొత్తం పదమూడు సార్లు ద్వారం వద్దకు రావడం ఆగిపోవడం వెనుదిరగడం చేశాడు. ఇక లాభం లేదనుకొని వేరే విధానం ఆలోచించాడు. "ఈ ప్రవేశద్వారం గోడ మీద గాథను వ్రాసేస్తే అది తప్పక గురువుగారి దృష్టిలో పడుతుంది. ఆయన ఈ గాథను

చూసి ఆమోదిస్తే "గాథను వ్రాసింది నేనే" అని ప్రకటిస్తాన
ఇది గురువుగారి ఆమోదానికి నోచుకోకపోతే నేను చేసేది
ధర్మరహస్యాలు వినే యోగ్యత నాకు లేదు అని సరిపెట్టుకో

ఆ రాత్రి సరిగ్గా పన్నెండు గంటలకు షెన్-ష్యూ
దీపాన్ని తీసుకొని రహస్యంగా సభామందిరం దక్షిణద్వార
వెళ్లి గోడ మీద క్రింది గాథను* వ్రాసి వచ్చేశారు.

ఈ శరీరమే ఒక బోధివృక్షము
ఈ మనస్సు ఒక మెరిసే అద్దము
మసకబారనీయరాదు దీనినెప్పుడూ
తుడవాలి వాలే దుమ్మును గంటగ

షెన్-ష్యూగారికి ఆ రాత్రి నిదుర పట్టలేదు. "గు
గాథను చూసి ఎలా స్పందిస్తారో " అనే ఉత్కంఠతో జాగరం

మరుసటి దినం ప్రొద్దున గురువుగారు ఆస్థాన క
వెంటబెట్టుకొని దక్షిణద్వారం గోడవద్దకు రాగానే ఆ గాథ కని
చదివాక కళాకారునితో "ప్రస్తుతానికి ఈ గోడల మీద చి

---

* ఇంగ్లీషు మాతృక:
Our body is the bodhi tree,
And our mind a mirror bright.
Carefully we wipe them hour by hour,
And let no dust alight.

వద్దనుకొంటున్నాను. 'సర్వసంస్కారాశ్చ మృషా మోషధర్మాణః' (all products are false and deceptive ) అని భగవానుడు చెప్పియున్నాడుకదా! మన బొమ్మల కోసం ఈ గాథను తుడిచి వేయడం నాకు నచ్చదు. ఇక్కడికి వచ్చేవాళ్లందరూ ఈ గాథను చదివి మననం చేసుకోవాలి. ఆచరణలో పెట్టి దుర్గతి నుంచి తప్పించుకోవాలి. పుణ్యసంపదను ఆర్జించాలి" అన్నారు.

ఆ తరువాత గురువుగారు శిష్యులనందరినీ అక్కడకి పిలిపించి ఆ గాథకు ధూపదీపారాధన చేసి శిష్యులను ఏకకంఠంతో ఆ గాథను పఠించమన్నారు. శిష్యులందరూ ఆ గాథను పఠించి "సాధు సాధు" (well spoken, well spoken) అని మెచ్చుకొన్నారు.

ఆ దినం అర్ధరాత్రి గురువుగారు షెన్-ష్యూగారిని తన నివాసానికి పిలిపించి "ఆ గాథను వ్రాసింది నీవే కదూ! బోధిమందిరద్వారం దరిదాపులకు వచ్చావు కానీ ఇంకా లోనికి ప్రవేశించలేదు. ఇంకా కొన్నాళ్లు బాగా ధ్యానం చేసి ఆపైన మరో గాథను వ్రాసి నాకు చూపించు. విమోక్షముఖంలో (door of liberation) నీవు ప్రవేశించినవాడుగా నాకనిపిస్తే ఈ గురుపీఠ చీవరాన్ని (robe), ధర్మరహస్యాలను నీకు సంక్రమింపజేస్తాను" అన్నారు.

రెండు రోజుల తరువాత ఒక శ్రామణేరుడు (novice) ఆ గాథను బిగ్గరగా పఠిస్తూ నేను పని చేస్తున్న చోటికి రావడం చూశాను. ఆ గాథను వినగానే నాకర్థమయిపోయింది-ఆ గాథను రచించిన వ్యక్తికి

చిత్తధర్మతా (real nature of mind) తెలిసి రాలేదనే విషయం. "ఎవరి గాథ ఇది?" అని అతణ్ణి అడిగాను. "మ్లేచ్ఛుడా (you barbarian), వడ్లు దంచడం, ముద్దలు మింగడం, నిదురించడం తప్ప ఇతర సంగతులు నీవెందుకు పట్టించుకొంటావు? నీలోకం నీదిగా ఉన్నావు. షెన్-ష్యూగారి అమోఘమైన గాథా రత్నమిది. రేపోమాపో ఆయన ఆరవ గురువు కాబోతున్నారు" అన్నాడు ఆ శ్రామణేరుడు. "సోదరా, ఆ గాథ ఏ గోడ మీద వ్రాసి ఉన్నదో నాకు తెలియదు. సభామందిరం ఏది ఎక్కడుందో కూడా తెలియదు. నీవు నన్ను అక్కడికి తీసుకెళ్ళు. ఆ గాథను నేను కూడా ధూపదీపాలతో పూజించాలనుకొంటున్నాను" అన్నాను.

ఆ పిల్లవాడు నన్ను అక్కడికి తీసుకెళ్లి గాథను చూపించాడు. నాకు చదువు రాదు. చియాంగ్-చౌ జిల్లా నుండి వచ్చిన ఒక క్రింది స్థాయి అధికారి అక్కడ కనిపిస్తే దాన్ని చదివి వినిపించమని కోరాను. అతడు చదివి వినిపించాడు. "నేనొక గాథను చెబుతాను. ప్రక్కనే వ్రాయి" అని అతణ్ణి కోరాను. "వింతల్లో వింత! నీవూ గాథను వ్రాసేవాడివా?" అన్నాడు అతడు చాలా అపనమ్మకంతో. "బోధిని కాంక్షించేవాడివి నీవయిన పక్షంలో మొదట నీవు చేయవలసిన పని నిమ్నవర్గీయుల పట్ల చిన్న చూపు వదిలించుకోవడం. నిమ్నులు ఉన్నతులు అనే తూకం బుద్ధి వల్ల చాలా పాపాన్ని మూటగట్టుకుంటావు" అన్నాను. నా చూపుల తీక్షణతకు, మాటల వేడిమికి అతడు అదిరిపోయి "నీ

గాథను పఠించు. వ్రాస్తాను. కానీ ఒక నిబంధన. నీవు గురుపీఠం అధిరోహించి ధర్మరహస్యాలు తెలుసుకొంటే వాటిని నాకూ చెప్పాలి" అని వ్రాసేందుకు సిద్ధమయ్యాడు. నేను ఈ గాథను* పఠించాను.

బోధివృక్షమూ లేదు
మెరిసే అద్దము లేదు
అంతా శూన్యతయే
దుమ్ము వాలే చోటేదీ?

ఆ గాథ ఒక కలకలాన్ని అక్కడ కలిగించింది. అయ్యారే, బాపురే లాంటి ఆశ్చర్యద్యోతక పదాల చప్పుడు విని గురువుగారు అక్కడికి వచ్చి ఆ కలకలానికి కారణం తెలుసుకొని కాలినుండి చెప్పును ఊడదీసి నిరసన భంగిమను ముఖం మీద తీవ్రంగా ప్రదర్శిస్తూ ఆ చెప్పుతో గాథను చెరపివేసి "వెర్రిమొర్రి గాథ" అని తిడుతూ వెళ్లిపోయారు.

మరుసటి దినం గురువుగారు ఎవ్వరికంటా పడకుండా నేను పని చేస్తున్న చోటికి తటాలున వచ్చి "ముముక్షువుగా ఉన్నవాడు ధర్మం కోసం ప్రాణాపాయాన్ని కూడా లెక్క చేయరాదు కదా! నీవేమనుకొంటున్నావు? బియ్యం సిద్ధమేనా?" అని ప్రశ్నించారు. "చాలా నాళ్ల క్రితమే సిద్ధమయ్యింది. జల్లెడ కోసం ఎదురు చూస్తున్నది"

---

* ఇంగ్లీషు మాతృక:
There is no bodhi tree,
Nor stand of a mirror bright.
Since all is void,
where can the dust alight.

అన్నాను. గురువుగారు మళ్లీ ఏమీ మాట్లాడకుండా నాచేతిలో ఉన్న రోకలి మీద తన బెత్తంతో మూడు సార్లు కొట్టి వెళ్లిపోయారు.

ఆ సంకేతానికి అర్థం ఏమిటో నాకు తెలిసింది కనుక ఆ రాత్రి మూడవ జామున రహస్యంగా ఆయన గదికి వెళ్లాను. నేను వెళ్లిన సమయంలో ఆయన తలుపులు లేని తన గదికిటికీలకు అడ్డంగా గుడ్డలను వ్రేలాడదీస్తున్నారు. ఆపైన నన్ను ఒక ఆసనం మీద కూర్చోమని చెప్పి మెల్లగా వజ్రచ్ఛేదిక ప్రజ్ఞాపారమిత సూత్రాన్ని నాకు వినిపించడం మొదలు పెట్టారు. "*న రూపప్రతిష్ఠితం చిత్తముత్పాదయితవ్యం. న శబ్ద రస గంధ స్ప్రష్టవ్య ధర్మ ప్రతిష్ఠితం చిత్తముత్పాదయితవ్యం*" వాక్యం వద్ద నాకు ఆశ్రయ పరావృత్తి (revolution at the basis) కలిగిపోయింది.

"చిత్తధర్మతను (essence of the mind = తథతా) తెలుసుకొన్నవానిగా నిన్ను నేను గుర్తిస్తున్నాను. బోధిధర్ముని వారసత్వాన్ని నీకు సంక్రమింప జేస్తున్నాను. ఇప్పుడు నీవు ఈ సంప్రదాయంలో ఆరవ గురువు అయ్యావు" అని ఆయన యుగపత్ విముక్తి శాఖ (sudden enlightenment school) ధ్యానరహస్యాలను నాకు బోధించి గురుపీఠానికి చెందిన చీవరాన్ని, భిక్షాపాత్రను నాకు అప్పగించి మళ్లీ ఇలా అన్నారు. "ఇక నిన్ను నీవు కాపాడుకొంటూ సాధ్యమైనమేరకు సోదర సత్త్వులను (sentient beings) విముక్తి పథానికి మళ్లించు. నీకు సంక్రమించిన ధర్మాన్ని వ్యాపింపజేయి. మొదటి గురువు బోధిధర్ముడు ఈ దేశానికి వచ్చినపుడు ఆయనను ఎవరూ నమ్మలేదు. ఎన్నో ఏండ్లు

పట్టుదలగా కృషి చేసి ఆయన ఇక్కడ ధర్మాన్ని వ్యాపింపజేశారు. ఆయననుండి సంక్రమించిన ఈ చీవరం, భిక్షాపాత్రను నీ అనంతరం మరెవరికీ సంక్రమింపజేయకు. వెంటనే నీవు ఇక్కడ్నుంచి వెళ్లిపోవాలి. ప్రాణాపాయం పొంచి ఉంది" అన్నారు.

"ఎక్కడికి వెళ్లాలి?" అని అడిగాను. "హుంయ్‌కి వెళ్లి అక్కడ కొంతకాలం అజ్ఞాతంగా ఉండు. నీకు ఈ ప్రదేశం కొండదారులు తెలియదు కనుక రేవు వరకు తోడుగా వస్తాను" అన్నారు గురువుగారు.

రేవుకు చేరి పడవలో కూర్చున్నాక తెడ్డు వేసే పని ఆయనే తీసుకొన్నారు. "ఈ పని మీరు చేయడం సబబు కాదు. నేను చేస్తాను" అన్నాను. నిన్ను నదిని (సంసారనదిని) దాటించడం నా కర్తవ్యం" అన్నారు ఆయన. "నేను సంసార బద్ధుడను కాను గదా" అన్నాను. "నీవన్నది సరియైన మాటే" అని ఆయన తెడ్డును నా చేతికిచ్చి "ధ్యానమార్గం నీవల్ల లోకంలో వ్యాప్తి చెందుతుంది. ఇక సరిగ్గా మూడేండ్ల తరువాత నా ఆయుష్షు తీరిపోయి ఈ దేహం అంతరించిపోతుంది. ఇకనుండి నీదే బాధ్యత. దక్షిణంగా వెళ్లగలిగినంత దూరం వెళ్లు. తొందర వద్దు. బౌద్ధప్రచారం తేలిక వ్యవహారం కాదు" అన్నారు. ఆవలితీరంలో నన్ను దింపి వీడ్కోలు చెప్పి ఆయన పడవలో వెనుదిరిగాక నేను దక్షిణంగా రెండు నెలలు ప్రయాణించి టా-యు కొండను చేరాను.

ఆ కొండను చేరాక కొన్ని వందల మంది నన్ను వెంబడించి వస్తూ ఉండడం గమనించాను. చీవరాన్ని, భిక్షాపాత్రను నానుండి

లాక్కోవడానికి వస్తున్నారని గ్రహించి పరుగెత్తడం మొదలుపెట్టాను. కానీ హ్యూ-మింగ్ అనే భిక్షువు నన్ను పట్టుకొనేంత సమీపానికి వచ్చేశాడు. అతడు పూర్వాశ్రమంలో సైన్యంలో నాలుగవ స్థాయి నాయకుడుగా పని చేసినవాడు. నేను చీవరాన్ని, భిక్షాపాత్రను ఒక బండ మీదికి విసిరివేసి అతని దృష్టిని వాటి మీదికి మళ్లించి ఒక పొదలో దాక్కున్నాను.

హ్యూ-మింగ్ పరమానందంతో వాటిని తీసుకోదలచాడు. అతని చేతికి అవి రాలేదు. వెంటనే అతనిలో పరివర్తనం కలిగి "సోదరా సోదరా, నీవెక్కడున్నావు? ఈ చీవరం భిక్షాపాత్రల కోసం నేను రాలేదు. ధర్మరహస్యాల కోసమే వచ్చాను. సోదరా సోదరా, ధర్మమేఘాన్ని నా మీద వర్షింపజేసి నా తాపాన్ని చల్లార్చు" అని ప్రాధేయపడినాడు. నేను పొదనుండి బయటకు వచ్చి అతనికి ధర్మాన్ని బోధించి మెంగ్ ప్రాంతానికి వెళ్లి అక్కడ ధర్మసేవకు అంకితం కమ్మని చెప్పి పంపివేశాను.

ఆ తరువాత నేను జు-హూాయ్ అడవిలో ఒక వేటగాళ్ల గుంపులో చేరిపోయి పదిహేనేండ్లు అజ్ఞాతవాసం చేశాను. నన్ను వాళ్లు ఒక వెట్టిబాగులవాడుగా భావించినందువల్ల నాకు ఇబ్బందులు కలుగలేదు. వలలు ఉచ్చుల వద్ద నన్ను కాపలా ఉంచితే వాటిలో పడి చిక్కుకున్న జీవాలను తప్పించివేసేవాడిని. వాళ్లు మాంసం వండుకొనే పాత్రలోనే నాకోసం కాయకసురులు వేసి ఉడకబెట్టుకొనేవాణ్ణి.

పదిహేనేండ్ల అజ్ఞాతవాసం తరువాత ఈ నగరానికి వచ్చి ఇదే దేవాలయం చేరాను. ఆ రోజుల్లో ఇక్కడ భిక్షు ఇన్-ట్స్యుంగ్ ధర్మభాణకుడుగా (preacher of dharma) ఉండేవాడు. నేను ఇక్కడికి చేరిన సమయంలో ఆయన శ్రోతలకు మహాపరినిర్వాణసూత్రాన్ని చెబుతున్నాడు. ఒక విషయంగా వాదోపవాదానికి దిగిన ఇద్దరు భిక్షువులు తటాలున లేచి నిలబడినారు. ఆ ఇద్దరిలో ఒకడు ధర్మభాణకునితో "భదంతా (venerable sir), మన దేవాలయం మీద బౌద్ధపతాకం గాలికి కదులుతూ ఉంటుందికదా! 'పతాకం కదులుతూ ఉంది' అన్నాను నేను. ఇతడు అంగీకరించడం లేదు. 'పతాకం కదలడం లేదు. గాలియే కదులుతూ ఉన్నది' అని వాదిస్తున్నాడు..." అని ఇంకా ఏమో అతడు చెప్పబోతుంటే నేను అడ్డు తగిలి "పతాకమూ కదలడం లేదు, గాలీ కదలడం లేదు. కదులుతున్నవి మీ మనస్సులే" అన్నాను. సభ అదిరిపోయింది. ధర్మభాణకుడు నన్ను వేదిక మీదికి ఆహ్వానించి ప్రక్కనే కూర్చోబెట్టుకొని మహాపరినిర్వాణసూత్రంలో చిక్కుముడులు లాంటి కొన్ని జటిల అంశాల మీద ప్రశ్నలు వేశాడు. ఆ చిక్కుముడులను విప్పివేస్తున్న విధంగా నేను సమాధానాలు చెప్పడంతో అతడు పరమాశ్చర్యంతో "సోదరా, గ్రంథాల్లో లభించని చక్కని సమాధానాలు నీ నోట వింటున్నాను. నీవు సామాన్య వ్యక్తివి కావు. ఐదవ గురువు నుండి చీవరం, భిక్షాపాత్ర, ధర్మరహస్యం స్వీకరించిన ఒక నిమ్నజాతీయుడు దక్షిణాదికి వచ్చాడని చాలా ఏండ్లుగా వింటున్నాను. సంశయం లేదు. ఆ వ్యక్తివి నీవే" అన్నాడు. అవునని

తెలుపుతూ నేను తల ఊపాను. చీవరాన్ని, భిక్షాపాత్రను చూపమన్నాడు. చూపాను.

అప్పటివరకు నేను ఉపాసకుడినే (lay disciple). ధర్మభాణకుడు నాకు ఉపసంపద (ordination) ఇచ్చి భిక్షువును చేసి ఆపైన నాకు నమస్కరించి శిష్యుడయ్యాడు.

ఆనాడు టుంగ్–షన్ విహారంలో బాలుడుగా ధర్మాన్ని గ్రహించి నప్పటినుండి ఇప్పటికి చాలా ఏండ్లు గడిచాయి. బాలుడు వృద్ధుడయ్యాడు. బుద్ధభగవానుడు బోధించిన అనిత్యతా సత్యానికి ఇంతకన్నా వేరే నిదర్శనం ఎందుకు? నీటిబుడగవంటి ఈ జీవితం టప్‌మని పగిలిపోకుండా ఇప్పటిదాక నిలిచియుండడం కన్నా పెద్ద అద్భుతం ఇంకేమున్నది? సోదరులారా, మనం గతించిన జన్మల్లో ఎంతో పుణ్యం ఆర్జించినందువల్లనే ఇప్పుడు ఇక్కడ కూర్చొని ధర్మాన్ని గురించి మాట్లాడుకొనుచున్నాము. మనందరి చిత్తాల్లో దాగి ఉన్న బోధిని బయటకు ప్రకాశపరచడమే మన జీవితాలకు పరమ ప్రయోజనం. ఐదవ గురువు నుండి నాకు సంక్రమించిన ధర్మాన్ని రేపటి నుండి మీకు చెబుతాను.

**Note:**– ఆరవ గురువు జీవిత చరిత్ర పూర్తిగా చెప్పాలంటే విడిగా పుస్తకమే వ్రాయవలసి ఉంటుంది. కానీ ఇప్పుడు చెప్పినంతవరకు చూస్తేనూ పూర్తి జీవిత చరిత్ర చెప్పినట్లే అనిపిస్తూ ఉన్నది. ఆ షెన్–ష్యూగారు ఏమయ్యారు? అనే జిజ్ఞాస కొందరికి కలుగవచ్చు. గురుపీఠానికి వారసుడు కాలేకపోవడంతో

షెన్-ష్యూగారు తీవ్రంగా కుమిలిపోయి ఉత్తరాదికి ప్రయాణం అయి చాలా ఏండ్లు ఏకాంతవాసం చేసి ఆపైన ఆయన కూడా జెన్ సంప్రదాయాన్ని తనదైన శైలిలో బోధించడం ప్రారంభించారు. ఈయన ప్రారంభించిన ఉత్తరాది జెన్ విధానానికి అనుపూర్వ విముక్తి శాఖ (gradual enlightenment school) అనే పేరు ఏర్పడింది. షెన్-ష్యూగారు, హుయ్-నెంగ్‌గారు ఎప్పుడూ ఒకర్నొకరు విమర్శించుకోలేదు. కానీ ఈ ఇరువురి అనుచరవర్గంలో కొందరు వీరాభిమాన దురభిమానులుగా మారారు. షెన్-ష్యూగారి వీరాభిమాని శిష్యుడొకడు హుయ్-నెంగ్‌గారిని హతమార్చదలచి దక్షిణాదికి ప్రయాణమయ్యాడు. ఆరవ గురువు దివ్యదృష్టికి ఇది తెలిసి తన గదిలో బల్ల మీద కొన్ని నాణాలు ఉంచి అతని రాక కోసం ఎదురు చూస్తూ కూర్చున్నాడు. అతడు రాగానే "రా బాబూ" అని సాదరంగా ఆహ్వానించి "ఈ దేశంలో కసాయివాళ్లకు ఒక జీవాన్ని వేటు వేస్తే లభించే కూలి ఒక రూక. కసాయి పని మీద నీవు ఇంత దూరం వచ్చావు కనుక దారిఖర్చుల కోసం అదనంగా పది రూకలు మొత్తం పదకొండు రూకలు ఆ బల్ల మీద ఉంచాను. నీ పని కానించి అవి తీసుకెళ్లు" అన్నారు. అతడు కత్తిని పారవైచి శిష్యుడయ్యాడు.

* * * * *

# 1. జేతవనం*

నమో భగవత్యా ఆర్యప్రజ్ఞాపారమితాయై

ఏవం మయా శ్రుతమ్. ఏకస్మిన్ సమయే భగవాన్ శ్రావస్త్యాం విహరతి స్మ జేతవనేఽనాథపిండదస్యారామే మహతా భిక్షుసంఘేన సార్ధమర్ధత్రయోదశభిర్భిక్షుశతైః సంబహులైశ్చ బోధిసత్త్వైర్మహాసత్త్వైః. అథ ఖలు భగవాన్ పూర్వాహ్ణకాలసమయే నివాస్య పాత్రచీవరమాదాయ శ్రావస్తీం మహానగరీం పిండాయ ప్రావిక్షత్. అథ ఖలు భగవాన్ శ్రావస్తీం మహానగరీం పిండాయ చరిత్వా కృతభక్తకృత్యః పశ్చాద్ భక్తపిండపాతప్రతిక్రాంతః పాత్రచీవరం ప్రతిశామ్య పాదౌ ప్రక్షాల్య న్యషీదత్ప్రజ్ఞప్త ఏవాసనే పర్యంకమాభుజ్య ఋజుం కాయం ప్రణిధాయ ప్రతిముఖీం స్మృతిముపస్థాప్య. అథ ఖలు సంబహులా భిక్షవో యేన భగవాం స్తేనోపసంక్రామన్. ఉపసంక్రమ్య భగవతః పాదౌ శిరోభిరభివంద్య భగవంతం త్రిష్ప్రదక్షిణీకృత్య ఏకాంతే న్యషీదన్.

## అనువాదం

నేను వినిన విధంబెట్టిదనిన, ఒకనొక సమయమున

---

* శీర్షికల పేర్లు మూలంలో లేవు. అనువాదకుడు పెట్టినవి.

భగవానుడు శ్రావస్తి నగరమునందు అనాథపిండదుని ఆరామమైన జేతవనములో ఉండినాడు. ఆయనతో బాటు 1250 భిక్షువులు మరియూ మహాసత్త్వులైన బోధిసత్త్వులు అనేకమంది ఉండినారు. ఒకనాటి ప్రొద్దున భగవానుడు భిక్షాపాత్రను తీసుకొని చీవరమును కప్పుకొని భిక్షాటనము కొరకు శ్రావస్తి నగరమును ప్రవేశించినాడు. భిక్షాటన చేసి భుజించిన తరువాత భిక్షాపాత్రను చీవరమును యథాస్థానములో ఉంచి పాదప్రక్షాళనము చేసుకొని తన కొరకు ఏర్పాటయిన ఆసనము మీద పద్మాసనము వేసుకొని నడుమును నిటారుగా ఉంచి శ్వాసను గమనించుచు(ఆనాపానసతి చేస్తూ) కూర్చుండినాడు. ఆ తరువాత చాలా మంది భిక్షువులు భగవానుడు ఆసీనుడైయున్న ఆ ప్రదేశమునకు వచ్చి భగవంతుని పాదపద్మములకు శిరస్సు వంచి వందనము చేసి భగవంతునికి మూడు పర్యాయములు ప్రదక్షిణము చేసి ఒక వైపున ఒదిగి కూర్చుండినారు.

*వివరణం: మనస్సును కలుషితం చేసేవాటికి క్లేశములు అని పేరు. 1. లోభం (greed) 2. ద్వేషం (hate) 3. మోహం (delusion) 4. మానం (conceit) 5. దృష్టి (dogmatic views) 6. విచికిత్స (doubt) 7. స్త్యాన (mental torpor) 8. ఔద్ధత్య (restlessness) 9. అహ్రీక (shamelessness) 10. అనపత్రాప్య (unconscientiousness). ఇవిగాక ఇరవైదాక ఉపక్లేశములు కూడా ఉన్నాయి. వీటిని వదిలించుకొని చిత్తాన్ని శుద్ధంగా ఉంచుకొనే వ్యక్తిని భిక్షువు (సన్న్యాసి) అంటారు.*

ఇటువంటి వ్యక్తులకు స్వంత సంపాదన, స్వంత ఆస్తి ఏమీ ఉండదు కనుక సమాజమే వీళ్ల జీవిత అవసరాలను తీర్చుతుంది. ఇందులో సందేహం అక్కర్లేదు. పైన తెలిపిన క్లేశాలను ఇంకా తొలగించుకోనప్పటికీ తొలగించుకొనే ప్రయత్నం చేస్తున్నవాళ్లనూ సమాజమే బాగా చూసుకొంటుంది-సమాజానికి ఇటువంటివారు కూడా అవసరం కనుక. వ్రజచ్ఛేదిక బుద్ధుని భిక్షాటనతో మొదలవుతున్నది కనుక ఈ ప్రస్తావన.

## KALAMA SUTTA

*Do not believe in anything (simply)*
*because you have heard it.*
*Do not believe in traditions because they*
*have been handed down for many generations.*
*Do not believe in anything because it is*
*spoken and rumoured by many.*
*Do not believe in anything (simply) because*
*it is found written in your religious books.*
*Do not believe in anything merely on the authority*
*of your teachers and elders.*
*But after observation and analysis,*
*when you find that anything agrees with reason*
*and is conducive to the good and benefit of one and all*
*then accept it and live up to it.*

# 2. అధ్యేషణ (request)

తేన ఖలు పునః సమయేనాయుష్మాన్ సుభూతిస్తస్యామేవ పర్షది సంనిపతితోఽభూత్సంనిషణ్ణః. అథ ఖల్వాయుష్మాన్ సుభూతిరుత్థాయాసనాదేకాంసముత్తరాసంగం కృత్వా దక్షిణం జానుమండలం పృథివ్యాం ప్రతిష్ఠాప్య యేన భగవాంస్తేనాంజలిం ప్రణమ్య భగవంతమేతదవోచత్- ఆశ్చర్యం భగవన్, పరమాశ్చర్యం సుగత, యావదేవ తథాగతేనార్హతా సమ్యక్సంబుద్ధేన బోధిసత్త్వా మహాసత్త్వా అనుపరిగృహీతాః పరమేణానుగ్రహేణ. ఆశ్చర్యం భగవన్ యావదేవ తథాగతేనార్హతా సమ్యక్సంబుద్ధేన బోధిసత్త్వా మహాసత్త్వాః పరీందితాః పరమయా పరీందనయా. తత్కథం భగవన్ బోధిసత్త్వయానసంప్రస్థితేన కులపుత్రేణ వా కులదుహిత్రా వా స్థాతవ్యం కథం ప్రతిపత్తవ్యం కథం చిత్తం ప్రగ్రహీతవ్యం?

ఏవముక్తే భగవానాయుష్మంతం సుభూతిమేతదవోచత్- సాధు సాధు సుభూతే, ఏవమేతత్సుభూతే, ఏవమ్ తద్యథా వదసి. అనుపరిగృహీతాస్తథాగతేన బోధిసత్త్వా మహాసత్త్వాః పరమేణానుగ్రహేణ. పరీందితాస్తథాగతేన బోధిసత్త్వా మహాసత్త్వా పరమయా పరీందనయా. తేన హి సుభూతే శృణు, సాధు చ సుష్ఠు చ మనసి కురు, భాషిష్యేఽహం తే-యథా బోధిసత్త్వయాన

సంప్రస్థితేన స్థాతవ్యం యథా ప్రతిపత్తవ్యం యథా చిత్తం ప్రగ్రహీతవ్యం. ఏవం భగవన్ ఇత్యాయుష్మాన్ సుభూతిర్భగవతఃప్రత్య శ్రౌషీత్.

## అనువాదం

ఆ సమయమున గౌరవనీయుడైన సుభూతి కూడా ఆ పర్షదమునకు *(assembly)* వచ్చి కూర్చొనియున్నాడు. ఆ పిమ్మట సుభూతి ఆసనము నుండి లేచి రెండు మూపులను కప్పికొనియున్న చీవరమును ఒక మూపునకు చేర్చి కుడి మోకాలును భూమి మీదికి ఆన్చి రెండు చేతులతో అంజలి ఘటించి భగవంతునికి ప్రణమిల్లి ఇట్లు పలికినాడు: "భగవాన్, ఆశ్చర్యము! సుగతా, పరమాశ్చర్యము! తథాగతులు అర్హతులు సమ్యక్ సంబుద్ధులు అయిన మీచేత మహాసత్త్వులయిన బోధిసత్త్వులు అనుగ్రహింపబడిన తీరు ఆశ్చర్యము! కరుణింపబడిన తీరు పరమాశ్చర్యము! భగవాన్, బోధిసత్త్వ యానములో ప్రయాణించుచున్న కులపుత్రుడుగానీ కులదుహితగానీ ఎట్లు నిలిచియుండవలెను? (అనివర్తుడుగా ఎట్లుండవలెను?). ఎట్లు పురోగమించవలెను? ఎట్లు చిత్తమును బోధిచర్యయందు లగ్నము చేయవలెను?"

*భగవానుడు:* సాధు సాధు సుభూతీ. యథార్థమునే పలికితివి. తథాగతునిచే మహాసత్త్వులైన బోధిసత్త్వులు మిక్కిలి అనుగ్రహింపబడినారు. కరుణింపబడినారు. సుభూతీ, చెప్పెదను

